ఓం.

శ్రీమద్గురు దేవతాయైనమః.

———:o:———

# కాళీప్రసాదిని.

బెజవాడ పురనివాసినియగు

శ్రీ జ్ఞానమాంబచే రచియింపఁబడియె.

గుంటూరు డిస్ట్రిక్టు సత్తెనపల్లి తాలూకా చింతపల్లి రాణీగారగు శ్రీ రాజా వాసిరెడ్డి వెంకటలక్ష్మీనరసమ్మ బహద్దర్ మన్నెసుల్తాన్ గారి ద్రవ్యసహాయముచే ముద్రింపబడి శ్రీ రంగావధూత భక్తజన సమాజమునకు ధర్మార్థముగా నొసంగబడెను.

ప్రకటనకర్త:—ఆత్మూరి రామమోహనరావు,

గుంటూరు.

సేతుముద్రాక్షరశాల,

మచిలీపట్నము.

1910.

# శ్రీ జ్ఞానమాంబజీవితము.



శ్రీకృష్ణా మండలమునకు మండనాయమానంబగు విజయవాడ (బెజవాడ) యనుపేరుచే బరగు పురవరంబున నివసించియుండు మహాపుణ్యాత్ములును సుజనవిధేయులు సకల సద్గుణ సమేతులునై పూర్వవృందారియు చందంబున శబ్దంబు తనరధరణింబుకీర్తి విలసిల్లుచు పార్వతీ పరమేశ్వరులోయన జననారు శేషమాంబా సుబ్బరాయలగర్భంబున ముత్తెపుచిప్పయందు ముత్యంబునుంబోలె మన్మథ నామసంవత్సర వైశాఖ శుద్ధ ౧ ౧ ఆదివారమున (౫–౫–౧౮౯౫) జననమొందిన శ్రీ జ్ఞానమ్మాంబ యొక్క చారిత్రము వినినవారికిని జదివినవారికిని నధికాశ్చర్యముగలుగుట యట్లుండగా మోక్షమార్గప్రదర్శినియై పరమానందము గలిగింపకమానదు. జ్ఞానమాంబ యా తల్లిదండ్రుల పూర్వజన్మతపఃఫలంబని చెప్పనొప్పు. ఈమె తల్లి మొట్టమొదట సంతానంబు లేమిచే గొంతచింతిల్లి తెత్పుర పర్వతాగ్రమున వెంచేసియున్న శ్రీ కనకదుర్గాంబను సేవించి నా తల్లి స్వప్నమందు గాన్పించి నా పేరున బిడ్డవేసి నీకు సంతానంబు గలుగునని వరంబిచ్చి యంతర్ధానంబునొందె. అంతకొన్నినాళ్లకు నామె గర్భంబుదాల్చి యా బిడ్డంగనెనుగాని యీమె కనకదుర్గా వరప్రసాదయనుమాట

యితరమహార్ఖ్యజనప్రోత్సాహ వచనముల చేత మరచి మరియొక పేరుబెట్టిరి. ఆపేరు బెట్టినతోడనే బిడ్డ పాలుగుడువక పోవుటయు నూరక పోరుబెట్టి యేడ్చుటయు మొదలగు చేయుచిన్నెలు గన్పట్ట నా తల్లి తిరిగి జ్ఞప్తికి దెచ్చుకుని శ్రీ కనకదుర్గాంబాయను పేరుబెట్టి పిలువ నారంభింపగా శిశువేడుపు డిగి పాలు ద్రావి దినదిన ప్రవర్ధమానయగుచు తలి దండ్రులకును తదితరులకును నీమెకనకదుర్గా వరప్రసాదయని తోచుచు పరమానందమును నయనోత్సవమును గలిగించసాగెను. ఈ బాలికకు పదిమాసముల వయస్సువచ్చియు రాకమున్నే స్పష్టముగ మాట్లాడుట్టకును నడచుటకును నారంభించినది. ఈమె చిన్నతనమునుండియు తోడిబాలికలతో నాటపాటలకు జనక సదా స్వామికైంకర్య కార్యముల నాటలుగాను దేవునిస్తోత్రములు పాటలుగాను గొని కాలముగడపుచు సత్యము ధర్మగుణము నీతి భూతదయ మొదలగు సుగుణసంపత్తిగలిగి యనుదినము జననీ జనకుల పాదపద్మముల కభివందనము గావించుచు పరస్త్రీ పురుషుల తోబుట్టువులవలె భావింపుచు నల్లారుముద్దుగ బెరుగుచుండెను.

ఇట్లుండ నొకనాడు కొన్ని యిబ్బందులచేత తల్లికాఫీ కాయుమని తనకాజ్ఞాపింపగా నా యాజ్ఞ శిరసావహించి కాచి పిదప పరికించిచూడగా నందులోనొక చచ్చినపురుగు కనబడుటచే మిగుల వ్యాకులత జెంది యానాడంతయు భోజన పానా

దులమూని చింతిల్లసాగెను. ఆహా! యేమి యీబాలికామణి భూతదయ! యిందువలన యీమె సర్వసములాలనియు కరుణానిధియనియు భూతదయ కలిగినదనియు జెప్పుటకు సందియమేమి? ఎప్పుడు సత్కర్మమార్గమును విడచియుండ జాలని కారణముచేత తల్లిదండ్రుం లాబిడ్డను, జదువుటకుబడికి బంపక కొంతకాలము వృథాపుచ్చగా తొమ్మిదవ సంవత్సరముచే నాక్రమింపబడిన యీబాలిక యొకనాడు తల్లికడకేగి అమ్మా నాకు చదువు చెప్పింపుమని వేడగా కూతురు కోరిక దీరుచు వలంపుతో నామె చదువరియగుటచే నింటనే యక్షరాభ్యాసము జేసెను. అట్టు లక్షరాభ్యాసము జేసిన పదియేను దినములకే చూచిన పుస్తకంబెల్ల యనర్గళముగా చదువుటకును చెప్పినదానినెల్ల నిరాఘాటముగా వ్రాయుటకును నేర్చెను. ఎప్పుడేసంగతివిన్నను ఎప్పుడేసంగతి జదివినను శిలాశాసనంబురీతిగా మనఃఫలకంబున లిఖించియే యుండును. ఉగ్గుబాలతో నేమిగలపి బోసినదియు జెప్పనట్టి జ్ఞాపకశక్తి గలిగియున్నది. ఆ బాలిక తెలివిని జ్ఞాపకశక్తిని గూర్చి విన్నవారును కనినవారును యాశ్చర్యమగ్నులు గాకపోరు. అంతియే గాక యేకసంతగ్రాహియని పేరువడసి కవితా నైపుణ్యము గాంచి నీ కడుపున కవీశ్వరి జనించునని తన తల్లికి తన తాతగారు సదా వచించుచుండు నాశీర్వచన మమోఘము జేసెను. ఎందయిన హరికథలు జరుగుచున్నను స్వామిభజనలు సాగు

చున్నను నెంతదూరమైన వేసటలేక జనుచు నీశ్వరజ్ఞానము గలిగి యార్యవర్యు లగపడిన భగవత్స్వరూపములుగా నెంచి నమస్కరించుచు, సర్వజన పూజనీయమై యుండి బీదసాదల యెడ గనికరము గలిగి సామర్థ్యంబుకొలది ద్రవ్యంబుచే తృప్తులంజేయుచు, వేదాంతగ్రంథముల సర్వదా పఠింపుచు నిరంజనుడు నిరాకారుడు నిర్గుణుడు నిరాలంబనుడు త్రిగుణాతీతుడు నగు యా భగవంతుని మహిమ గొనియాడుచు దన్ను జేరిన వారలకు భక్తిజ్ఞాన విషయంబులను బోధింపుచు ప్రపంచాతీతయై పన్నెండవ యేట శ్రీ రంగావధూతగారి ప్రియశిష్యులగు శ్రీ సీతారామావధూతగారిని పైవయోగంబునగాంచి వారిని పరమగురువులుగా భావించి శుశ్రూష సలిపెను. పిమ్మట తల్లిదండ్రులు వివాహ మొనర్చిరిగాని యా బాలిక ప్రాపంచక సౌఖ్యమునుగోరక సర్వసంగ పరిత్యాగంబు జేసి పదమూడు సంవత్సరముల వయస్సు వచ్చియు రాకమునుపే సన్యసించి నిజజ్ఞానాధిక్యముచే తన గురువువలన జ్ఞానమాంబయని పేరు పెట్టబడెను. ఈ బాలికారత్నము శ్రీ రంగావధూత, శ్రీ సీతారామావధూతల చారిత్రముల పద్యకావ్యములుగా వ్రాసినది. ఆహా! యేమి యీ బాలిక సుగుణ సంపత్తి! కొంచపుకాలములో స్వానుభవంబు జేతనే నఖండవిద్యనేర్చి మహాజ్ఞానియైన యీమె యదృష్టమేమి! యీమె తలిదండ్రుల పుణ్యమేమి! అజ్ఞానాంధకారమునబడి నల్లాడు మానవులకు, యీ మహనీయురాలి పుణ్య చరిత్రము ముక్తిమార్గ ప్రదర్శిని గాదె!

ఆత్మూరి రామమోహన రావు.

గుంటూరు.

క. తల్లియు దండ్రియు నీవే
కొల్లగ బ్రత్యక్ష దేవి ♦ గురువున్నీవే
యుల్లంబున నీపదయుగ
ముల్ల విధుల స్మరణజేతు ♦ నేగురు రూపా ॥ 4

క. ఓ ధీక్షుని పరమాత్మా
మీాదయకే పాత్రురాల ♦ మేదినిలోనన్
సాధు సుజనసంవేద్యా
యీాధరనన్ గరుణజూడు ♦ మింపుగ కాళీ ॥ 5

క. అజ్ఞానముతోనుంటి ని
జజ్ఞాననిధే సుదేవి ♦ సద్గురురూపా
అజ్ఞానంబును బాపియు
సుజ్ఞానమునిమ్ముతల్లి ♦ సొంపుగ కాళీ ॥ 6

క. కామరోప్పంగను నిశ్చల
త మనంబున గలుగలేదు ♦ తల్లి వేగం
బమలత నిశ్చలతయునా
కమరించుము దివ్య రూప ♦ యంబా కాళీ॥ 7

క. మాయయగు మెరుక జెండియు
హాయిగ నాచిత్త మెప్పు ♦ నమలంబౌనీ
శ్రేయోదాయక పదముల
నే యనిశము దలప వలయు ♦ నేయో కాళీ॥ 8

క. దుర్గుణములలో నొకటియు
నిర్గుణి నన్నంటకుండ ♦ నీకృపజూపన్
భార్గవి యాసద్గుణముల
సర్గముగా గలుగ జేయు ♦ జక్కఁగ కాళీ॥ 9

క. నీపాదాబ్జంబులె నా
ప్రాపని నెరనమ్మియుంటి ♦ బాగుగ మదిలో
నేపున గలవరముడిపియు
కాపాడుము వేగిరమున ♦ గరుణను కాళీ॥ 10

క. నీ దివ్యపదాబ్జంబులె
నాదు హృదిన్నిల్పి నెప్డు ♦ నయమొప్పంగా
ప్రోదిగ నేధ్యానించెద
మోదము నాకిమ్ము తల్లి ♦ ముదమున కాళీ॥ 11

క. కాళీ నీపాద జపము
జాలగనే జేయుచుంటి ♦ సమరసబుద్ధిన్
బాలాచిత్తస్థైర్యము
వాలాయము గలుగ నిమ్ము ♦ వరములు కాళీ॥ 12

క. అమ్మా గురు రూపిణి నా
నెమ్మది నిను నమ్మియుంటి ♦ నిశ్చయమిది బం
ధమ్ముల నెడబాపియు నె
య్యమ్మున నానందమొసగు ♦ మహాకాళీ॥ 13

క. ఏనాటికి మాతా పర
మానందంబేసుగాంతు • నవనీస్థలి నీ
దానిర్మల కృపగల్గు టి
కేనాటికె గురునిరూప • యిరవుగ కాళీ॥ 14

క. మానితమగు మీఘనకృప
చే నయముగగల్ల భ్రమలు • చెండితి దివ్య
జ్ఞానము నొంద బూనర్పెద
బూనియు మీపాదసేవ • పొందుగ కాళీ। 15

క. జయమొందగలవు నీవిక
భయమేటికి ధాత్రిలోన • పరమ సుశీలా
నయనిర్మలమతితో ని
ర్భయమున జరియించు మీవు • బాగుగ బాలా॥ 16

క. సుగుణ గరిమను మనోభ్రమ ..
తెగవైచి వినిశ్చలమున • తేజోమయమై
నెగడెడి మనమున గురుపద
యుగళము లే స్మరణ జేయు • చుండుము బాలా॥ 17

క. గురువరు పాదాబ్జంబులె
మరువని ధ్యానమున నీదు • మతినెల్లప్పుడన్
స్మరియించుచు విలసిల్లుము
గరిమను పరమార్థ పదవి • గాంతువు బాలా॥ 18

క. పరిపరి విధముల మనసును
జరియింపగ జేయ నేల • సద్గుణశీలా
గురుసేవ నూని సర్వము
బొరిపుచ్చుము వేగముక్తి • బొందుము బాలా॥ 19

క. అవివేకమహత్వముచే
త వివేక విహీనవగుచు • తగనీకాలం
బువృథాగడపితి వకటా
భువిపర మొందుటకు పాటు • బొనరపు బాలా॥ 20

క. గాఢవిరక్తియు మౌనము
రూఢిగ నేకాంతమును సు • రుచిరమనీషన్
బాడిగ మగ్నత నొంద ని
రూఢిగ పరమార్థమొంద • త్రోవసుబాలా॥ 21

క. ఏమార్గమునైనందుంచిన
నామార్గమునందె నడచి • యది విడలేదా
నీమనను నెరిగి నిర్మల
మౌమార్గము నందెనుంచ • నగును సుబాలా॥ 22

క. స్మరణయు మననయు క్రియలను
విరివిగ నభ్యాసమైన • విషయములందా
బొరిపుచ్చ లేదు చిత్తము
గరిమను యువిమూఢు మంచి • గావలెబాలా॥ 23

క. అడుసుం ద్రొక్కంగ నేటికి
అడుగును గడుగంగ నేల ♦ నారీతిగనే
చెడుగు బొనర్చగ నేటికి
చెడుగున శ్రమ లొందనేల ♦ శ్రీకరబాలా॥ 24

క. బురదం ద్రొక్కని వారికి
నరయ గడిగికొనెడు పనులు ♦ నవనింగలవే
మరియీగతినే పాపము
బొరయని వారెట్టి శ్రమలు ♦ బొందరుబాలా॥ 25

క. మనసు విధం బెరుగనిచో
ఘనయోగులరైన గాని ♦ కడుయిడుములంగో
నను బడి చెడుదురు నిక్కం
బనుపమ మీమనసు చర్య ♦ లాహా బాలా॥ 26

క. ఏవిధ వేదనలుండవు
నీ విలసిల్లంగ నోర్పు ♦ తీవ్రవిరాగం
పావన సత్యము శాంతము
వావిరిగా గల్గియున్న ♦ వారికి బాలా॥ 27

క. గురుభక్తి లేని వారలు
పరమార్థము బొందరెట్టి ♦ ప్రౌఢులరైనన్
సరవిని సద్గురునే యా
పరమాత్మగ నెంచుసతతము ♦ బడయును బాలా॥ 28

క. మిథ్యయె ప్రాణము దేహము
మిథ్యయె గృహపుత్రదార ♦ మిత్రుల్ భృత్యుల్
మిథ్యయె సర్వవిషయములు
మిథ్యయటంచెరిగి విడుపు ♦ మీ భ్రమ బాలా॥ 29

క. ఏవిషయముచే సౌఖ్యం
బీవసుధను లేదు గాన ♦ నింగిత మొప్పం
గా విషయ రహితమున గల
యావర సౌఖ్యమును గాంచి ♦ యలరుము బాలా॥ 30

క. ఆనందము నొందుటకై
మానసమేకాగ్రపరచి ♦ మానిసి గురుచే సు
జ్ఞానముగని పరమాత్మను
నీనెగడగ గాంచి వెలయు ♦ తెల్విని బాలా॥ 31

క. క్షమయును సత్యము శాంతం
బనులతయును భూతదయయు ♦ నైకమతింబున్
ప్రముదితమగు దివ్యజ్ఞా
నము నొందగ సాధనములు ♦ నియమముగ బాలా॥ 32

క. శాంతము లేకుండినచో
స్వాంతమున విచారణంబు ♦ బాగొప్పంగన్
మంతనమున జేయగ నిసు
మంతయినను వీలుయుండ ♦ దవనిని బాలా॥ 33

క. మేలును కీడును రెండును
యాలోచింపక నొనర్చు ♦ నట్టి పనులచే
వాలాయము సంకటముల
పాలగుటకు హేతువగును ♦ పరమసుశీలా॥ 34

క. పరశత్రువు కోపంబే
విరివిగ నజ్ఞానమమత ♦ వృద్ధిగ జేయున్
తరుగని దుర్గుణ జాలము
పెరుగంగా జేసి దుఃఖ ♦ పెట్టును బాలా॥ 35

క. దురితంబుల కన్నింటికి
పరికింపగ సన్నృతంబె ♦ పాదగుదానిన్
బోరిపుచ్చక ధరియించిన
తరుగని దుఃఖంబులన్ని ♦ తాకును బాలా॥ 36

క. సత్యము జ్ఞానము ధర్మము
నిత్యముగా శాంతియోర్పు ♦ నిర్మల చిత్తం
బత్యంతభక్తి నీయెడ
సత్యవతీ కలుగ వలయు ♦ జననీ కాళీ॥ 37

క. ఎంతమహా మహాత్ములైనను
స్వాంతమును జయించ లేరు ♦ సామాన్యముగా
పంతుగ శ్రీగురు కృపలే
కెంత మహా మహిమలున్న ♦ నేటికి బాలా॥ 38

క. చిత్తంబను చండాలిని
మత్తెక్కిన మహిషరీతి • మాయామయమై
తత్తరపడు యీమానస
మెత్తెరగున స్వస్థపడునొ • యిమ్మహి కాళీ॥ 39

క. దేశికవరుల పదంబులె
భాసురముగ నెల్ల వేళ • భావమునందున్
వేసరక భక్తి శ్రద్ధల
చే నుమతిని స్మరణ జేయు • శ్రీకర బాలా॥ 40

క. స్ఖలన రహిత చిత్తముతో
చలనంబిసు మంత లేక • స్వస్థతనుంటిన్
దలపగ నే నీకృపచే
కలకాలము సౌఖ్యమిమ్ము • కరుణను కాళీ॥ 41

క. ఘనమగు పరమానందం
బును నే నేనాడు గాంతు • పొందుగ మదిలో
సనుమానరహిత మొంది జ
నని నేనెపుడుందు జెపుమ • నయముగ కాళీ॥ 42

క. బాయక పరమానందపు
హాయిని వేగంబె యిచ్చి • హాకుఃరురూపా
హేయంబై బొల్చెడియీ
కాయంబును బాపు మమ్మ • కాళీ కాళీ॥ 43

క. పాపంబులు జన్మములో
నోపావని లేకయుంటి ♦ నోగురురూపా
నీపరమ కరుణచే యిక
గాపాడ వదేలనింత ♦ కఠినము కాళీ॥ 44

క. ఏనోల్లను విషయంబులు
ఏనోల్లను తల్లి ప్రాణ ♦ మేనియు మదిలో
మానక గురు రూపా నీ
ధ్యానంబున నుండదలతు ♦ నార్యా కాళీ॥ 45

క. ఏటికి నాకీదేహము
బూటక మిదిస్థిరముగాదు ♦ పోయెడి దేగా
నేటుగ పరమా నందము
పాటిగ నాకిచ్చి దీని ♦ బాపుము కాళీ॥ 46

క. అయ్యో యెంతటి పాపినో
జయ్యన నానంద పదవి ♦ సమకూర్పక నా
కుయ్యాలింపక నుంటివి
నెయ్యంబున బ్రోవు వేగ ♦ నిర్మల కాళీ॥ 47

క. ఎడబాపవె యీదేహము
తెడవేలనె గురునిరూప ♦ తల్లీ వెరిమన్
వడిగానే విడి పించుము
గడువులు బెట్టంగ వలదు ♦ కాళీ కాళీ॥ 48

క. గురురూపా హేసాక్షాత్
పరదేవీ కన్నతల్లి ♦ ప్రత్యక్షంబా
పరమాత్మా వేగంబే
పరమానందంబు నిమ్ము ♦ పావని కాళీ॥ 49

క. వలదంబా యీ దేహము
వలదంబా యశము లోక ♦ వైభవమెల్లన్
వలదంబా యేవిషయము
దలపగ గురురూప నీవు ♦ దక్కను కాళీ॥ 50

క. అనఘాత్మా గురురూపా
నినుబాయగ లేను తల్లి ♦ నిమిషంబైనన్
జననీ నామొరవిని న
న్ననిశము నెడ బాయ కుండు ♦ మంబా కాళీ॥ 51

క. శ్రీభగవతి గురురూపా
నాభావము నందెనిన్ను ♦ నయముగ దలతున్
ధీభాసిల్లెడి జ్ఞానము
నోభార్గవి యిమ్ము తల్లి ♦ యోహో కాళీ॥ 52

క. నీకన్న నన్య విషయము
లో కలుష వినాశి దోచ ♦ కుండగ వలయున్
రాకేందు వదన నిన్నే
ప్రాకటముగ మదిదలంప ♦ వలయును కాళీ॥ 53

క. అసమాన విరక్తి నిధా
త్రిసకల విషయములయందు ♦ తేటగ మదిలో
హాసగంజేయుము తల్లి
పసిబాలిక మొరలు వినియు ♦ బాగుగ కాళీ॥ 54

క. నేనెంత వేడు కొన్నను
హీనపు యీ దేహబంధ ♦ మెడపక బ్రహ్మ
జ్ఞానము నివ్వక నుంటివి
ఏనేమి బొనర్తు నింక ♦ నిమ్మహి కాళీ॥ 55

క. వినవే నాప్రార్థనములు
ఘన బ్రహ్మ జ్ఞానమహిమ ♦ కల్గించగదే
జననీ మ్రొక్కెద నాకీ
తనువే విడిపించ గదవె ♦ తల్లి కాళీ॥ 56

క. ప్రాపంచిక గొడవలు నీ
వేపాటియు నంటకుండ ♦ నెప్డును మదిలో
నేపాటించక నుండుము
శ్రీపరి పూర్ణంబు వేగ ♦ జెందెదు బాలా॥ 57

క. అచలానందముగన్గొన
బ్రహ్మశంబుగ దలచి తేని ♦ భావాతీతుల్
సుచరిత్రులు నగు గురుని ను
రుచిరంబుగ దలచి గనుము ♦ ప్రోవను బాలా॥ 58

క. మౌనము పూర్ణ విరక్తియు
రాణించగ సర్వ సంగ ♦ రాహిత్యంబున్
మానితమగ్నత లుండిన
చో నిర్మల వృత్తి గల్గు ♦ జుమ్మిను బాలా॥ 59

క. దేవీ గురు వీవేనని
భావంబున నెంచి నేను ♦ భక్తి దలిర్పం
గా వినుతించుచు నుంటిని
బ్రోవవె పరమార్థ మొసగి ♦ పొందుగ కాళీ॥ 60

క. పరిపూర్ణ జ్ఞాన మొందగ
పరి పూర్ణ విరక్తి నొంద ♦ వలయును జుష్మా
ధర నఖిల విషయములపై
. పర మొంద విరాగ మీవు ♦ బడయుము బాలా॥ 61

క. ముక్తిని బొందగ విషయా
సక్తిని పూర్ణముగ వీడి ♦ జాలగ విషయవి
రక్తిని పొందగ వలెనా
రక్తులకల జ్ఞాన సిద్ధి ♦ రాదిల బాలా॥ 62

క. ఎంత విరక్తిని జెందిన
నంతసుఖము నంద వచ్చు ♦ నవనీస్థలిలో
నెంత ధనంబార్జించిన
నంతియెకా గొప్ప తనము ♦ నందుట బాలా॥ 63

క. భువిపై నున్నంత వరకు
నెవరైనను బర్వతాగ్ర • మెరుగంగలరే
వివరింప నిల్లు దెలియవు
అవలంబన లేని స్థితులు • నారయ బాలా॥ 64

క. అవలంబించిన పిమ్మట
నవలీలగ దెలియవచ్చు • నదియేదైనన్
భువిదాని మంచి చెడుగుల
నివియెల్ల నెరింగియుండు •మీావు సుబాలా॥ 65

క. అనవసరపు రంధిలతో
జననీ కాలంబు వృధగ • జరిపితినిక నీ
ఘన పద సేవను సల్పుచు
మనమున నేచింత లేక • నుండవలె కాళీ॥ . 66

క. నీవేనేనై పోవలె
నోవిమలి? యఖండ జ్ఞాన • మొగినొందవలెన్
భావాతీతము గావలె
గావవె గురు వరుల రూప • కరుణను కాళీ॥ 67

క. ఇమ్మాపూర్ణ విరక్తిని
యమ్మా విషయాళి యఖిల • మందున నాకున్
ఇమ్మా బ్రహ్మజ్ఞానము
నెమ్మది నినెనమ్మితమ్మ • నిర్గుణ కాళీ॥ 68

క. చిన్నతనంబున నుండియు
గన్నమ్మా నీదుపైన ♦ కడుప్రేమముతో
జెన్నుగ నినె నమ్మితినా
నన్నెడ బాయక యెబ్రోవు ♦ నయముగ కాళీ॥ 69

క. పసినాటనుండి నాపై
యసమాన కృపాకటాక్ష ♦ మవనీస్త్రలిలో
రసికత జూపుచు నుంటివి
నొసగవె జ్ఞానంబునింక ♦ నోహో కాళీ॥ 70

క. సుడిచక్రము చందమ్మున
కడువడి నీలోకమందు ♦ కాలంబెల్లన్
గడుచుచునున్న యదకటా
వడిగా సుజ్ఞానసిద్ధి ♦ వడయుము బాలా॥ 71

క. తనువుం బ్రాణముమాయయె
గనుమీ ప్రాపంచమెల్ల ♦ గల్లయటంచున్
వినుమీ బ్రహ్మజ్ఞానం
బనునది యొక టేస్థిరంబ ♦ టంచును బాలా॥ 72

క. త్యజియించుము జీవభ్రమ
నిజముగ వెల్గొందుయాత్మ ♦ నీవేసుమ్మా
విజితంబుగ నిదిగని నీ
నిజగతి నెరుగుండుమింక ♦ నేటుగ బాలా॥ 73

క. ఎపుడీ జీవభ్రమవిడు
నపుడే యాత్మస్వరూప • మగుదువునీవే
నిపుణత మేఘముతొలగిన
సఫలతగా సూర్యుడుండు • చూడ్పున బాలా॥ 74

క. వాణీ యాత్మాకారమె
నేనని దెలియంగజాలు, • నిజముగదివ్య
జ్ఞానము నాకిమ్మాని
న్నేనమ్మితి గురునిరూప • నిజముగ కాళీ॥ 75

క. పంతమ లేటు జననీ నీ
వింతటి నిర్దయతబూన • నేటికినాపై
సంతత మానందాబ్ధిని
గంతులు వేయంగ జేయ • గదవే కాళీ ॥ 76

క. నీ ముద్దులసుత దుఃఖము
లో మునుగగ నేమిగలవు • లోపములిలలో
క్షేమకరీ పాపరహిత
కామోద మొసంగవేల • నంబా కాళీ ॥ 77

క. తనువనియెడు ఘోరపిశా
చిని నీకృపనెల్లజూపి • శీఘ్రముగనే
జననీ విడజేయుమునా
మనవిని మన్నించి దివ్య • మాతా కాళీ॥ 78

క. వేగమె బ్రహ్మజ్ఞానం
బోగురురూపా ధరిత్రి ♦ నొసగుము తల్లీ
బాగుగనా మొరవిని వే
వేగమె దేహంబుబాప ♦ వే యోకాళీ॥ 79

క. ననుబోలు మహాపాపుల
వనిలో నెవ్వరైనగలరె ♦ బాలాంబా నీ
తనయునయిగూడ నెంతో
ఘనమగు దుఃఖములగంటి ♦ గద యోకాళీ॥ 80

క. వేసారితి నత్యంతం
బీ సారవిహీనదేహ ♦ మెత్తుటచేతన్
నీసత్కృపచే దీనిని
తోసర్వేశ్వరివిడల్చు ♦ మోహో కాళీ॥ 81

క. ఓనిర్గుణి గురురూపా
మానసముననీదు స్మరణ ♦ మరువనుగా నిన్
బ్రాణము పోయిన విడువను
మానితచారిత్రదివ్య ♦ మాతా కాళీ॥ 82

క. నీదగు కృపలేకుండిన
భేదాదులు శూన్యమగునె ♦ వేగమెతల్లీ
యేదీ నీసుతకిమ్ము య
భేదజ్ఞానంబు భవ్య ♦ ప్రేమను కాళీ॥ 83

క. గర్వము రాగము ద్వేషము
సర్వేశ్వరి వేగిరమున ♦ జక్కాడగదే
సర్వసమతయు విరాగము
నిర్వికలమనంబునిమ్ము ♦ నీటుగ కాళీ॥ 84

క. కామాది శత్రువర్గము
నీమహిమను బేరులేక ♦ నిజముగశూన్యం
బోమాతా జెందె మహా
యామోదము గలుగజేయు ♦ మంబాకాళీ॥ 85

క. నీదివ్యమహిమ నెరుగం
గా ధర నెవ్వరికివశము ♦ కాదుగదమ్మా
యో దేవీ నిరతము నీ
పాదంబులె దలచువారి ♦ వశమగు కాళీ॥ 86

క. సూనృత వాక్యాదిగగల
మానితసద్గుణములెల్ల ♦ మానక నైజం
బై నెగడవలయు దివ్య
జ్ఞాననిధే కేవలాత్మ ♦ జననీకాళీ॥ 87

క. ఆ తత్త్వజ్ఞానంబును పర
మాత్మా నాకెన్నడిత్తు ♦ వంబామది జీ
వాత్మాభిమానశూన్యత
యాత్మానందంబునిమ్ము ♦ యమ్మా కాళీ॥ 88

క. నాపుణ్యంబున కంతం
బీ పుడమి గురుస్వరూప ♦ యేపాటియులే
దే పరమాత్మా నీవే
కాపాడగ నేమికొరత ♦ గల్గును కాళీ॥ 89

క. వద్దే తల్లీ దేహము
రద్దియికేమిటికి దీని ♦ రయమున ధాత్రిన్
శ్రద్ధను బాపుమనిన నీ
ముద్దులను తమొరలువినవు ♦ మూర్ఖమ? కాళీ॥ 90

క. నీవూర్ణ కరుణ లేకయె
గా పాపపు మనసుచేత ♦ ఘనమౌనిదుముల్
రాపిడిగా గనుచుంటిని
• ఏపాటియు కృపనుజూడ ♦ వేమే కాళీ॥ 91

క. భోగంబులపై- భ్రాంతులు
శ్రీగురుమూర్తి స్వరూప ♦ చిత్తములోనన్
బాగుగ నిసుమంతయులే
వే గరిమనురక్షజేయ ♦ వేమే కాళీ॥ 92

క. ఔరా నాయమ్మానీ
క్రూరత్వంబెంచవశమె ♦ గుణరహితా యీ
సార విహీనపు దేహం
బే రమ్యచరిత్రబాప ♦ వేయో కాళీ॥ 93

క. ఎన్నివిధంబుల వేడిన
మన్నించక యుంటివకట ♦ మాతాపెరిమన్
గన్నసుత మొరలువినియిక
గ్రిన్నన దేహంబుబాప ♦ గదవే కాళీ॥ 94

క. జ్ఞాననిధే నాయమ్మా
మానితముగ విన్నపంబు ♦ మన్నించియు ప్రా
జ్ఞా నుగ్రహముంజూపియు
హీనపు యీదేహబంధ ♦ మెడపుము కాళీ॥ 95

క. బాలా జీవభ్రాంతిని
జాలగ గురుకరుణచేత ♦ జక్కాడిమదిన్
లాలిత బ్రహ్మజ్ఞానపు
మూలము గన్గొనుమునాదు ♦ ముద్దుల తనయా॥ 96

క. మూలం బేమీ జగమున
కో లలితాంబా యెరుంగ ♦ కుంటిని దీనిన్
మూలముతో నెరిగింపుము
బాలాంబా పాపరహిత ♦ భార్గవి కాళీ॥ 97

క. బిడ్డా ప్రకృతికిమూలము
దొడ్డగ జెప్పంగవినగ ♦ త్రోవమె లేదా
చెడ్డదియగు భ్రమచే కను
బడ్డది బ్రమశూన్యమైన ♦ వట్టిది బాలా॥ 98

క. కారణము లేని కార్యం
బేరీతిని గల్గునమ్మ ♦ యీాయదిగలుగం
గారణమే లేదనగా
బౌరా యాశ్చర్యమాయె ♦ నంబా కాళీ॥ 99

క. మాయా సర్వజగంబును
మాయానీవున్ను నేను ♦ మాయయె సుమ్మీ
మాయావినుటయు జెప్పుట
మాయను మాయించిపోయి ♦ మరుగుము బాలా॥ 100

క. చెప్పుట వినుటయు మాయయె
ఒప్పుగ పరమాత్మజ్ఞాన ♦ మొగిగల్గినచో
జప్పున శూన్యంబగు భ్రమ
లప్పుడె మోక్షంబుగల్గు ♦ నారయబాలా॥ 101

క. సద్గురువరు కృప లేక యె
సద్గతిగన నేర్చికైన ♦ శక్యముగాదా
హృద్గతమున గురుసేవను
సద్గుణివై ముక్తికొరకు ♦ సల్పుము బాలా॥ 102

క. నిత్యము సద్గురురూపా
యత్యంతము నీదుదివ్య ♦ మాధ్యానమెనా
కృత్యము గావున దానిని
సత్యముగా జేయుచుంటి ♦ జననీకాళీ॥ 103

క. నీ కరుణామృతముండగ
నాకేమికొరంత లేదు ♦ ననుగన్నమ్మా
లోకభ్రమ లేపాటియు
నాకు నిజము లేవు బో్రవు ♦ నయముగ కాళీ॥ 104

క. నాతల్లిదండ్రిగురువుల
ఖ్యాతిగ ప్రత్యక్షదేవి ♦ ఘనవిభవంబున్
ప్రీతిగ బ్రహ్మజ్ఞానము
నీతిగ మద్గురుసురూప ♦ నీవే కాళీ॥ 105

క. నీవే నా సౌభాగ్యము
నీవే జ్ఞానంబుతల్లి ♦ నిఖిలసుఖంబుల్
నీవే యాత్మాకారము
నీవే యానందపదవి ♦ నీవే కాళీ॥ 106

క. నీధ్యానమె నాజ్ఞానము
నీధ్యానమఖండజ్ఞాన ♦ నిత్యానందం
నీధ్యానమె నాసౌఖ్యము
నీధ్యానమె నాకుముక్తి ♦ నిజముగ కాళీ॥ 107

క. అనుమాన వినాశనమున్
ఘనమైన యఖండజ్ఞాన ♦ గరిమయునిత్యం
బును దివ్యానందంబును
జననీ నీధ్యానమొసగు ♦ సదయత కాళీ॥ 108

క. మహితమతీ నాకిమ్మా
మహదానందంబుజ్ఞాన ♦ మహిమయునమ్మా
మహిలోపల జననీ నీ
మహిమల నెన్నంగవశమె ♦ మాతాకాళీ॥ 109

భుజంగప్రయాతము.

అవేద్యా మహాదేవి ♦ యాచార్యరూపా
భువిన్నమ్మితిన్ మిమ్ము ♦ పూజ్యాహరీస
న్నువేబ్రోవుమమ్మాయ ♦ నూనంపుమైత్రిన్
భవానీ పరాశక్తి ♦ భవ్యాత్మకాళీ॥ 110



